ఓం

శ్రీ పరమేశ్వరార్పణమస్తు

# శేషభూషణ శతకము


రచయిత :

కట్రోజు శేషబ్రహ్మయ్య.





గుంటూరు తాలూకా పెనుమూలి వాస్తవ్యులు

కొల్లి సూరారెడ్డి, చక్కా కోటివీరయ్య,

గూడపాటి వెంకటేశ్వరరావు,

కొంగర వెంకట్రామయ్య

గార్లద్రవ్యసహాయముచే ముద్రింపబడినది.

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

1941

బ్రహ్మశ్రీ

## పులికొండ పరబ్రహ్మ కవి గారు

అతిశయమైన భక్తి కిర
  వైతగు ప్రార్థన లొప్పుచున్న యీ
శతకమునందు తప్పుల ప్ర
  శంసకు తా విసుమంత లేదు సం
తత సముపాశ్రితావన మ
  నః కలితుం డగు శేషభూషణుం
నతులను తప్పు పద్ధతికి
  నానెము గీనెములేల చూడగన్ !

ఓం

శ్రీ పరమేశ్వరార్పణమస్తు

# శేషభూషణ శతకము

శ్రీ పరమేశ్వరాయను నశేషజనంబుల బ్రోతువంచు నీ
ప్రాపును గోరియుంటి త్వరఁ బాలన చేసియు ధన్యు సేయుమీ
పాపను గాదలంచియును బాపము లందగ జేయకయ్య నీ
వాపదఁ బాపు బంధుడని నాశయ మొందితి శేషభూషణా. 1

ఉ॥ ఒక్కడె లోకరక్షకుడు నొక్కడె నీజగముల్ హరించు దా
నొక్కడె సర్వ వ్యాపకుడు నొక్కడె నిశ్చలమైన బల్లిదుం
డొక్కడె నీభువిన్ సుజనులోరుపుతోడను గాంచుగాని వే
రొక్కడు లేడటంచు మఱి నొక్కియు వేడితి శేషభూషణా. 2

చ॥ నినుమదినమ్మి పద్దముల నేనిపుడల్ల దలంపునుంటి వే
నను దయజూడకున్నతరి నన్నిల గాంచెడివార లేరికన్
గనుము దయానిధే, పతితుగా దలపోయక పేర్మిజూపియున్
మనుపగ వేడుచుంటిని నుమాధవ బ్రోవుము శేషభూషణా. 3

ఉ॥ పండిత పామరాదులును పాలన సేయఁగ నీ చరిత్రముల్
కొండలవంటి దప్పులవి కొల్లలుగా గనుపించు నెట్లనన్
మండలనాథ నా హృదయమండలమందున విద్యశూన్యమై
యుండును గాన నీ ప్రవిమలోన్నతి గూర్పుము శేషభూషణా. 4

ఉ॥ తల్లియు దండ్రియున్ సుతులు దారయు బంధులు విత్తమంతయున్
కల్ల యటంచు నామదికి గన్పడి మీభజనంబు గోరితిన్
దల్లియుదండ్రియన్నయును దాతయు నేతయు నీవటంచు నే
నుల్లమునందు నమ్మికొనియుంటి పరాత్పర శేషభూషణా. 5

ఉ॥ బాలుర జవ్వనంబులను బాయని భ్రాంతుల నేకమివ్వగన్
కాలము వ్యర్థమాటయును గంటిమి దుర్గ్బలమున్ వసించగన్
కాలను చేరువయ్యెనని గాలుడు సన్ననజాలనట్లుగా
పాలన సేయుమయ్య కడు బాధల గూర్పక శేషభూషణా. 6

ఉ॥ చాలఁ బవిత్రమై మధురసంబులు చిప్పిలు నీకథాసుధన్
గ్రోలగ నెంచు నామతిని గూడదటంచని రాపు సేయకన్
చాలగ వేడుచుంటినని సత్కృప నామొఱ లాలకించియున్
బాలన సేయ రమ్మి ప్రుడు పంతము బూనక శేషభూషణా. 7

ఉ॥ కామితవస్తుసంపదలు కల్లని యుల్లము నందు నమ్మి నేఁ
బ్రేమను గొల్వ నెంచితిని పెద్దయు నీమృదు పాదపద్మముల్
సామికటాక్షవీక్షణదృశంబులు నాపయి గూర్చు వేడుకన్
దామస మొంద కెన్నటికి దైవశిఖామణి శేషభూషణా. 8

ఉ॥ నిచ్చలమైన డెందమును నీచమనస్కుల దూరసంగతిన్
సచ్చరితా! యొసంగుమని సన్నుతిజేసితి దేవదేవ! నే
ముచ్చట జెందిగోరునది మూర్ఖప్రసంగమటంచు నెంచియున్
కచ్చి మనంబునం గొనక గావ తలంపుము శేషభూషణా. 9

ఉ॥ కాలము గార్హ్యపత్యము సుఖప్రదమంచను మాట నెంచకన్
శూలధరున్ స్మరించుట దిపోయగ మేగనుమంచు బల్కు స్త్రీ
లోలత నాకొసంగియును లోతున వేయుట కిచ్చగించకన్
చాలగ మేలుగూర్చుమిక చంద్రధరాత్మగ శేషభూషణా. 10

చ॥ అనుపమశీల నీ మహిమ నారయ దీనుడ సాధ్యమాన నా
కనువుగనుండు వాంఛితము లంతయు కాదనకుండ దీర్తువా
దను పుకృతార్థమొందుననిదాలిమితో స్మరియింపుచుండెదన్
గనుమ బవిత్రుసేయగన కాంక్షితు జేయుము శేషభూషణా.

ఉ॥ కాలము వ్యర్థపుచ్చకను గ్రన్నన నీ భజనం బొనర్చగా
బాల శశాంకశేఖర! స్వభావ మనేక దరంగులం జనన్
గోలను గిల్ల జేసెదవు గోపము పాపము నేర్పు లోపమా
దాలిమితో నెరుంగుటకు దారి యగమ్యము శేషభూషణా.

ఉ॥ చండ ప్రచండ సిన్ని దను సన్నుతి జేసెదనంచు భ్రాంతినా
కుండును గాని నీ కృపయు నుండకపోయిన లభ్యమాన నా
యండవు నీవటంచు మది కందియు వేడుచునుంటిని త్రిరిన్
మొండకు ప్రేమగన్గొనియు మేలొనగూర్పుము శేషభూషణా

ఉ॥ అంబిక జీవితేశ సహృదయాంబుధి నెంజలి బాపనెంచు నీ
మంబుగ నెల్లవేళలను మాధవ యంచు స్మరింతు నర్థినై
వెంబడెనంచు దామసము వేహృదయంబున దట్టివీడకన్
సంబర మొందసేయుమయ సాగిలిమ్రొక్కెద శేషభూషణా.

ఉ॥ కన్నసుతుండు దుండగము గ్రక్కున చేసిన దండ్రి దాల్మితో
మన్ననజేయు నెంచ డెయుమాధవ యట్టుల గాంచు నీకృపన్
పిన్నడనంచు దోసముల పెక్కు ఘటింపక సత్కృపామతిన్
తిన్నగ జూడు మెంచితిని దివ్యపదంబిడి శేషభూషణా. 15

చ॥ పసితనమాదిగా సకల పాపము లెన్నియొ జేసియుంటినన్
కసిపడగూడ దెట్టులన గాంచగ మూలము నీవ దెట్లనన్
నిసిదగదంచు దండ్రి సుతు సీ విధిగాదని మాన్పకుండుటల్
పసిసుతు లోపమెట్లగునొ పాలన సేయుము శేషభూషణా.

చ॥ పశువులు మేతకై వగచి బండిన చే నదటంచు గోచకన్
కశువుగ నాశ జెంద పశుగాపరి వేగమె కామజూపుయీ
పశువులకుండు మర్త్యముల శాయగ జేసియుగాంచు నట్టియా
పశుపతి వీవుగాదె వడి శాలన సేయుము శేషభూషణా. 17

చ॥ పలువురుగూడి సీభజన భక్తిగ నర్చన సేయుచుండియున్
బొలుపుపథంబు నొందగను భూరి ముదంబున డెంద
మందు నిన్
దలచెడువారి నేలగ నుదారతకర్తవు సుప్రసిద్ధ మీ
దలపుల నెన్న నా తరమ దాపకునీకృప శేషభూషణా. 18

చ, ఇలనతి కాంక్ష జెందియును నేమియునిన్ దలపోయ
కుండియున్
మలినపు వర్తనంబులను మానరు కారణ మేమనంగ నీ
వలిగియు చూడకున్న నిల నందరి కేవిధినబ్బు సౌఖ్యముల్
బలమది యెంతగల్గినను పండితులైనను శేషభూషణా. 19

చ॥ అరయసమస్త జీవులకు నన్నముపానములిచ్చి గాచియుఁ
పురహరనిన్ను నెంచగను బూజ్యుల జేసియు మోక్షమిచ్చియుఁ
వరములఁ గూర్తువట్టు లనె బావము గల్గియు నన్ను గాంచు, స
త్వరము దయానిధే కడు నవస్థల బెట్టక శేషభూషణా. 20

ఉ॥ నాదను సట్టి దంతయును నమ్మ్రిక లేదుగదా యటంచు నే
సాదరమైన డెందమున సాహస విక్రము డీవటంచునిఁ
నాదర మొప్ప నేడితిని నాగ్రహ మొందక గాంచుమయ్యనఁ
బాధలబెట్ట బోల్గొనక భ్రామినిదీర్చియు శేషభూషణా 21

చ॥ హరపలు కాంతులన్నిడకు హైమవతీధవ నీకుమ్రొక్కెదఁ
సురుచిర మైన నీభజన సొంపుగ నామదికింపుగూర్చియుఁ
తిరమగు డెంద మిచ్చియును తీయని నీకథ లాలకించెడిఁ
సరసుల నేస్తమిచ్చియును సత్కృప నేలుము శేషభూషణా.

చ॥ ఉరు బలశాలినం చనెడి నూహాజెలంగియు సజ్జనావళిఁ
బిరుసు దలంపునం బొలియభీతిని కేకలు వేయుచుండగన్
పరుసతనం బటంచు మది భావికదుర్దశ దా మెరుంగకఁ
శిరములనూచు దుర్మతులుచిత్తమునీయకు శేషభూషణా.

చ॥ పలువ తసంబుతోడ పర భామకునై పరవిత్త మార్జనం
బులకనురక్తులై యెదనుమూర్ఖమటంచును భ్రాంతిజెందకఁ
తులువతనంబె కానికడ ద్రోయును దైవమటంచు దోచకన్
కులికెడి వారిలోననను గూర్పకు మ్రొక్కెద శేషభూషణా.

ఉ॥ కానకపోతినయ్యయిలకాని ప్రయోజనముల్ చరింపుచుఁ
బూనగనైతి మీ భజనబూనిన కర్మమదేమొగా నికఁ
మానగనైతిదుర్ణడత మాన్యులగాంచియునైననించుకఁ
బూనగసేయుమంచునుడు బుద్ధులెరుంగను శేషభూషణా.

ఉ॥ భూరిత సత్త్వసంపదలభోగ్యమునాకొనగూర్చ కెన్నడుఁ
వారణచర్మచేల నిదొ వాస్తవమైన ప్రసక్తి దెల్పెదఁ
పూరణమైన మోదమున భూవిభునీస్మరణంబు సేయగఁ
గారవమొప్ప గూర్చుమయ గౌరిమనోహర శేషభూషణా.

చ॥ అరయగ సర్వజీవులకుయార్తజనావనుడై సమస్తముఁ
కొఱతయుగల్గకుండునటు గూర్తువటంచునుడిందలంచి నే
మరువక గొల్చుచుంటినినుమాధవనాచరితంబుగాంచియుఁ
మరుపును జెందకన్నెపుడు మన్పుము పేర్మిని శేషభూషణా.

చ॥ ఘనతరమైన రూపమును గాంచెడికోరిక జెందియుండి నే
ఘనముగ వేడుచుంటిగదగాంచక నెంచుమసంతసించెదఁ
మునుపిలనెందరో గనగమూర్తినొసంగితివంచు భ్రాంతినిఁ
గనవలెనంచు నెంచితిని కారుణికోత్తమ శేషభూషణా.

చ॥ అతివినయంబునఁ మదినహర్ణిశలఁ గొనియాడుచుండు యో
పతితునినైన నీకృపచె పావనుజేయు మహాత్ముడీవటం
చతిథుల నీప్సితార్థముల నారసిదీర్చెడి దాతవంచునుఁ
మతిగలవారు బల్కవిని మానక వేడితి శేషభూషణా. 29

ఉ॥ ఎంతటిబోధకర్తలును నెంతగ సంధ్యలువార్చు పాఠలుఁ
నెంతగ దేవతార్చనల నేమరకుండెడి భక్తులైన నీ
చింతనమే ప్రధానముగ జేయనిపక్షమునందుగాంచి మా
సాంతపు జంద్రుభాతిగను. శంకర జేతువు శేషభూషణా.

ఉ॥ కాలముకర్మమంచునొక గారడిబల్కులుపల్కుచుంద్రుయా
కాలముకర్మమిట్టిదసి గాంచగరాని మహాద్భుతంబు దా
కాలముకీలెరుంగకను కాయపుసత్కృతదుష్కృతంబులన్
చాలగ నేమొ జెప్పుదురు జంత్రి నెరుంగక శేషభూషణా.

ఉ॥ పుట్టుటదెట్లో బుట్టియును పూర్వపువైకరిగాంచు టెట్టులో
నెట్టులజచ్చునో మరియు నెచ్చటికేగునో నేమిసేయునో
గట్టిగ జెప్పవా రొకరు గాంచగ గానరు పృథ్విలోన నీ
దిట్టదనంబుగాంచ దగుధీనిధులెవ్వరు శేషభూషణా. 32

చ॥ నిను మది నమ్మువారికిని నేమిగొరంతయు గల్గకుండగన్
దనువులురంజిలన్ బదవిదా మొటుగోరక నీయొసంగియున్
మనుపుదువంచుబల్కిరిలమాన్యులుబల్కర మొందునట్లుగన్
జననుతయూసవిస్తరపు సౌఖ్యముగూర్చుము శేషభూషణా

ఉ॥ కారణభూతుడౌ గరళకంఠుడ, నీ కృపలేక యుండినన్
భూరమణుల్ నఖండమగుభూతినిపాయుదు రాక్షణంబునన్
శూరుల దేకువల్ నడగి చోద్యపుటూహాలు ప్రజ్వరిల్లియున్
వీరిడిచేష్ట లబ్బియును వీసము జేయదు శేషభూషణా.

ఉ॥ నీమముతోడ నిన్దలచు నేరుపు జూపియు నా కదేలనో
నేమియు దోచనీక నెపు డేదియొ జీకును గల్గ జేసియున్
బామరు సేయ నెంచెదవు బాపమ దేమియు చేసియుంటినో
దామసమొందుచీవిధిని తత్తరగూర్తువు శేషభూషణా.

ఉ॥ నీకృపలేక నన్నియును నేర్చినయట్టి సమర్థు డయ్యు దా
నే కృషి చేయ జాలుటకు నేర్పరిగా డత డిద్ధరిత్రిలో
నీ కృపగల్గియున్న తరి నీటును గోటు ననేకచిహ్నముల్
ప్రాకృత వైఖరిన్ వరలు భక్తజనాళికి శేషభూషణా.

చ॥ పసితనమందు నేదయిన బాపము చేసిన దండ్రిగాంచి వే
గసరియు బుజ్జగించునటు గాంక్షితులంగడ తేర్చగావలెన్
రసికుడ నీవెఱుంగని బురాణములుండు నెధాత్రిలో పలన్
కసిపడకుండ ధర్మమును గాంచుపరాత్పర శేషభూషణా. 37

ఉ॥ ఏమని జెప్పనోపుటకు యోఘనుడైన నెరుంగజాలకన్
సీమహిమా విశేషమున నీచపదంబెన మోఘ భ్రాంతిగన్
తామహి విఱ్ఱవీగుచును దబ్బరడంబములెన్నొ గొట్టుచున్
నే మహనీయుడంచునుడి నేర్పడ జేతువు శేషభూషణా. 38

ఉ॥ పిల్లతనంబు బీత్వముకు బ్రీతినినొందినయట్టి స్తన్యముల్
పెల్లు నిపీడనంబనెడి బ్రేమను గూర్తువ దేమి యోని నిన్
చల్లగ నుద్భవించినను చానలజూచియు కామభ్రాంతులన్
కొల్లగ గూర్చి నీస్మరణ కోల్పడసేతువు శేషభూషణా. 39

చ॥ కరుణను నిన్నుమించు ఘన కారుణికోత్తము లెవ్వరంచు నీ
దరిగొనివారి యాశ్రితము తక్కక దీర్చెదవంచు నన్ మదిన్
తిరముగ వేడుచుంటి నిను తీవ్రమునా మొరలాలకించియున్
పరముని జేయుమయ్య భవబంధవిముక్తుడ శేషభూషణా. 40

చ॥ అరయగ నేరనైతిగద యద్రిసుతేశ్వర మంచి చెడ్డలన్
బురహర నిన్ దలంపక యిహభూతియె శాశ్వతమంచు నెంచుటల్
పరమసుఖంబిదంచెనయు భ్రాంతిని జెందియు నిన్ను పేర్మితో
స్మరణ మొనర్చుచుంటి నను సత్కృప నేలుము శేషభూషణా.

చ॥ ఇహమున నుండు సౌఖ్యములు నింపును గూర్చునటంచు భ్రాంతితో
నహహ యటంచు జేసియును నాపయి భీతిని వార్థకంబునన్
మహదపచారమాచరించియును మాధవ నీకృప నందియుండలే
దిహమున నెందరో మునుపు నింపెసలారగ శేషభూషణా

చ॥ అరయగ నెంత నేరుపరులైనను నీకృపనందియుండకే
కరణివ్రతంబు లెన్నియును కాంక్షమదిన్ దను జేయరి త్తయో
స్థిరము బరాత్పరా మిము నుతింపక నేరికినైన మోక్షమున్
కరువున కాదిరైయె వరలు గాంచగ నెప్పుడు శేషభూషణా. 43

చ॥ పశుపతి పాహిపాహి యని ప్రస్తుతి జేసిన మౌని బాలుకీ
వసువులనిచ్చినట్టి ఘనుడా! యని నీ స్మరణంబు జేసితిన్
శశిధర చక్రపాణిసఖ శాశ్వతపుణ్య మొసంగి బ్రోవరా
దశశిరవంద్య నన్ గనుము దైవశిఖామణి శేషభూషణా.

ఉ॥ పండితులంతనిన్ దలచి పావనమొంది రటంచు భ్రాంతినే
మెంచుగ పూనినిన్ ప్రతినిమేషము ప్రార్థన జేయుచుంటినిన్
మండలనాథ నాగొడవు మందునిదంచు దలంపకుండి నీ
యండను గూర్చి నేలుమ నిజాశ్రితరక్షణ శేషభూషణా. 45

చ॥ సదయుడవంచు చయ్యనను సత్కృపతోడను బ్రోతువంచు నే
కొదువయు లేదటంచు నినుగొల్చెడి వారలకంతమందుయీ
ప్పిదముల దీర్తువంచు నుడిసీఘ్రగతిన్ భువి దెల్లమయ్యె వే
గదసియు నేలుమయ్య పరుగా దలపోయక శేషభూషణా.

చ॥ నియమతులైన వారలను సిచులుబెట్టెడి కష్టనష్టముల్
మెఱుని సహింపనోపక నమేషము వేడెదరెన్నొ భంగులన్
దయగని వారిమానసము దల్లడమొందగనీక జేయు నీ
దయనిసుమంత నాకిడియు ధన్యునిసేయుము శేషభూషణా.

చ॥ ధరగల మంచిచెడ్డలును దైవకృతంబని నెంచుదీనులన్
దరహసితంబునన్ ఘనులు ధైర్యవిహీనులటంచు దూరుచున్
బురహరుడంచు నెంచెదరు ముందు ప్రయత్నములేక నీశ్వరుం
డిరువును గూర్చునాయవని కేవిధినందురు శేషభూషణా. 48

ఉ॥ ఏ విధినైన నీ కృపకు నేర్పడినయ్యెదటంచు పేర్మితో
సేవ యొనర్చుచుంటి కడుసీఘ్రత నేలుము నీదు ప్రేముడిన్
పావను జేయ నెంచు పలుబాముల బాలొనరించి జూడకన్
గావగ నీకు మ్రొక్కెదను గాంచుకృపన్నిడి శేషభూషణా.

ఉ॥ పాపపు ద్రోవలంబడియు బ్రామిని నిం దలపోయకున్న నీ
జేపది యేమొగాని సిరి జేపడ జేసియు వారినిన్ మహో
పాపుల సేయ జూచెదవు హస్థలిపీశియు నిన్ను గొల్చినన్
ఏపున జూపకుండెదవు నేమది దద్విధి శేషభూషణా. 50

చ॥ నిను దలపోయువారలను నీచుల మాడ్కి నిగష్ట పెట్టుటల్
మనసెసగంగ నెంచియనుమానవితండమనస్కుడౌదువా
గనుటకు నాతరంబవున కారుణికోత్తమ నిష్ఠుడీవు నే
యనువున నైననన్ గనుము నర్థిసటంచును శేషభూషణా.

ఉ॥ భారమటంచు నెంచి పెరవానిని గామదిలో దలంచకన్
గారవమొప్ప నేలుమయ గౌరిమనోహర రాపు సేయకన్
కారణభూతుడీవనెడి కాంక్షను నే దలపోయుచుంటి నీ
కూరిమి జూపుమయ్య గుణకోవిదుడీవుగ శేషభూషణా. 52

ఉ॥ పాపుడనంచు జూచితివ బాలుడటంచును నొల్లకుంటివా
ఏపున నన్ను నేలవది యేమి విరోధిన వెర్రివాడనా
తాపము గూర్చ నెంచియును తత్తర గూర్చుటకిచ్చగించి నీ
ప్రాపును జూపకుండెదవు పాపమదేమది శేషభూషణా.

ఉ॥ నీదయ గల్గియున్నతరి నిశ్చయమాను శుభంబటంచు ని
న్నేదగ వేడుచుంటి నిపుడేలగ నెంచుము ఖ్యాతిగల్గు నే
ఖేదము దిందలంచియును భీతిల జేయకుమయ్య మ్రొక్కెదన్
సాదరమైన నీకృపను సాకుము కొంకక శేషభూషణా. 54

ఉ॥ కానకనాసదోడనిల కంజదళాక్షుల పొందుగోరియున్
దాని సముచ్చరింపకను దాండవమాడుచు నీచబుద్ధినిన్
మేనుసుతుల్ ధనంబుకడుమిక్కుటమంచును నెంచు వెర్రిగా
మానసమీాయ నెంచకను మాన్యుని జేయుము శేషభూషణా.

చ॥ అతిగుణహీన బుద్ధినిమదాంధకుడై నిను గాంచ నేరకన్
గతివిడి చర్మచేల మమకారముచే నిల నుండునట్టి భూ
పతులను గొల్వనిచ్చుకడుపార భుజింపగ నెంతొ ద్రవ్యమున్
సతము భజింపగన్పడని సాహసమాన్యుని గొల్వ నేటికిన్
మతిదలపోయు కూళునిగ మానసమీాయకు శేషభూషణా.

ఉ॥ ఈశుడు నీశుడంచుదను నెంత భజించినవాని కార్యమా
యీాశుడు సేయు నాదనునభీష్టము దోడను జేయకుండ స
ర్వేశుని పైన భారమిడి నీదురుగాలిలో దీపముంచి లో
కేశుడుగాంచు వేయనిన నీటుగ వెల్గునె యంచునాస్తికా
గ్రేశుని మానసంబిడక గీర్తిమదిన్నిడు శేషభూషణా 57

ఉ॥ కాలముమిక్కుటంబుగను గాంచగనుండెగ నిప్పుడేమదిన్
బాలశశాంకు నెంచుటది భావ్యమెనారయధాత్రిలోపలన్
చాలగ జెప్పనోపగిన సౌఖ్యము లెన్నియొయుండియుండగా
మేలని బూను టెంతయును మేదిని పద్ధతి గాదటంచు స్త్రీ
లోలదలంపునాకిడియు లోతున వేయకు శేషభూషణా. 58

ఉ॥ కానిపనుల్ నొనర్చియును గ్రన్నన వ్యర్థుల జేరి సర్వముం
సానులపాలు జేసియును సాహసమిచ్చియు నందుమీదటం
మానముబోవిదోచకను మానిని బుత్రులవీడ నెంచియున్
కానన కేగబోను ఘనకార్యుని సేయకు శేషభూషణా. 59

ఉ॥ మాపునొ రేపునో గనను మాధవ నాత్మను మేగు బ్రాణముల్
కేపున నాశ చెంది మన కేమని సత్యము నాస్తి జేసియుం
దాపరితాప మొందుచును ద్రవ్యము గుట్టలు బెట్టనెంచు నే
పాపపుటూహ లన్నిడక భక్తినొసంగుము శేషభూషణా. 60

ఉ॥ నేరక చేయుచుండగను నీటుగ బారు జలంబు మాడ్కి నా
నేరములన్ని సైపుటకు నేర్పరి వీవయటంచు నెంచి నీ
వారిధి దాట జేయుమని బాయక నిన్ మది కోరుచున్న నా
కోరిక దీర్చ రమ్మిపుడు కోపము బూనక శేషభూషణా.

ఉ॥ దంతసమూహముల్ సడలి దల్లడమొందెడి తన్వు వేళ నీ
కింతటి మాట లేటికని యీర్ష్యలు బల్కుట కెంచు పౌత్రులుం
వింతలబల్కు లేల యని వేగము నొక్కడు బుత్రపుత్రికల్
సంతిసమంత వీడినను సర్వము గోయకముందె గాంచి నీ
చింతన భాగ్యమబ్బునటు జేయుట కెంచుము శేషభూషణా.

ఉ॥ కాముల వెక్కిరింతలును కాంతయు జూచి యసహ్య
మొందుచుం
బ్రామియు లేనిపై ముసలివాసరు భాతిగ వేళకోళముల్
యీమహిలోన జేయునటు నించుకయైనను నెంచకుండగం
దామహిమావి శేషమిడ ధన్యుని సేయుము శేషభూషణా.

చ॥ మలమును మూత్రమున్ నొడల మర్దనజేసుక యుండు వేళలన్
గలగలబీనుగాయనుచు కాంతన నేకముగూయ నెంచియున్
చలముగ నీవు నెన్నటికి చావవు సంకటమైతివంచు దా
బలుకకముండె నన్నుగని బాలనసేయుము శేషభూషణా.

ఉ॥ నోటను మాటరాకయును నొడ్డినపాటికి రాక కేకలున్
మోటుగ వేయుచున్ నెపుడు మోమును ద్రిప్పుచు కాళ్లమంచపున్
కోటికి తట్టి రానటకు కోపము నవ్వును నేడ్పు భీతి పో
రాటముతోను కింకరుల రాపిడిబెట్టకు శేషభూషణా. 65

ఉ॥ కాలము చేరువైసతరి కాంతను మంచముచుట్టు మూగియున్
బాలగ బుత్రపుత్రికలు జాలిగ నేమియు జెప్పవంచునున్
గోలగవీరు వారడిగి గొంతున గ్రుక్కెడునీరునిబోయకన్
జాలిని వీడకన్ మునుపె చాలకృపన్ గను శేషభూషణా.

ఉ॥ కాలముదీరినన్ వెనుక గాంచగలేనను భీతిజెంది నే
చాలగ వేడుచుంటి కడు జాలము సేయక గాంచు పేర్మిడిన్
శూలధరా పరాకులిడి చూడుము నాశయ మొందుచుంటి వే
పాలన సేయరమ్మనుచు బ్రార్థనజేసితి శేషభూషణా. 67

ఉ॥ నీపదసేవనంబిడుము నీచనరావళిలోన జేర్చకన్
శ్రీపతివంద్య నన్ జొనుపు శీలమనీషులలోన నెప్పుడున్
పాపపువాంఛలన్ విడియు బాపునిగా నొనరూర్చ కెప్పుడున్
నీపదధ్యాన మేమరని నిశ్చలు జేయుము శేషభూషణా. 68

ఉ॥ నాపయి కోపమూనకుము నంది తురంగ పరాకునైననిం
కేపుననైననున్ కడకు నేవిధినైనను నెంచుకైననున్
భూపతి నీపదాబ్జముల భూరిముదంబున గొల్చువారికిన్
లోపములెన్నియున్ననవి లోటుగ నెంతువె శేషభూషణా.

చ॥ సరసగుణప్రపూర్ణువని సన్నుతిచేసి భజించ రమ్మనన్
బురహర నీతిశాలినను మూర్ఖునిగా తలపోయకన్ మదిన్
తిరమగు సౌఖ్యమిచ్చియును దివ్యపదంబొసగంగ జేయగా
నరమర సేయ నెంచకుము నారయ సర్థిని శేషభూషణా.70

ఉ॥ శ్రీపరమేశు పాదముల శీలమదిన్ భజియింపసర్వమున్
జేపడునంచు బల్కిరిల శిష్టజనావళినీతి బోధగన్
యాపతి బాంధవుండనచునార్యులుకొందరు నొక్కిచెల్పనీ
ప్రాపునుగోరియుంటినిదొ బాయక నేలుము శేషభూషణా.

ఉ॥ మానక గొల్తు నీదయినమంత్రజపంబున మశ్శివాయ ఓం
దీనజనావనా యనుచు దేకువతోగొని యాడునట్లు నీ
వానతి యిచ్చియుంటివదినారయ నీప్రియమెంతొ గల్గిగా
మానవనాథ నాగొడవుమానక దీర్చుము శేషభూషణా72

ఉ॥ కారణమింతలేకను దగాగ వివాదములాడి దీనులన్
భూరితమైన కష్టముల బూర్తిగ బెట్టెడు దుర్మదాంధులన్
వీరవరేణ్యుడీవయును వేగమెద్రుంచియు నిన్ను గొల్చువా
రేరికిగల్గుయాపదల నెల్లనడంచుము శేషభూషణా, 73

ఉ॥ కార్యము నుద్ధరించుతరి కార్ముకదక్షునిబోల్కి నీవువే
శౌర్యముజూపిబ్రోచెదవె శాశ్వతగీర్తిని నబ్బునట్లుగా
ధైర్యవిహీనులైనతరి దార్కొనదెంతయు దేకువిచ్చియున్
శౌర్యపరాక్రమవిక్రముల సాయమొనర్చియు శేషభూషణా.

ఉ॥ కారణమైన జన్మలకు గాక దిగంబడు మానవాళి నీ
తీరు నెరుంగ సాధ్యమ యథేచ్ఛగ బూజల నెన్ని జేసినన్
క్షారములేని కూరకు రసజ్ఞత సేకురకుండు భాతి నే
తీరుగనైన మీదుగృప దేజముగల్గమి శేషభూషణా.

ఉ॥ కాలముబోవుచుండెగ దగాంచగ ప్రాణములెప్పుడో విడున్
చాలగనీకు గోచరమె శాంతుడ నీపయినుంచు నాహితం
బాలనసేయ నెంచుమయ భ్రాంతు లనేకమునిచ్చి వీడకన్
బాలశశాంకమౌళి పెరవానిగ జూడక శేషభూషణా.

ఎంతో కృపాసముద్రుడవు యెంచిమది న్నిపుడెంతో భ్రాంతితో
సంతసమొందుచుంటిగద సాహసవిక్రమ ఏల రమ్ము నా
పొంతను బంతమేలరయ బొల్లుడగానుగ నాశ్రితుండవే
చింతదొలంగ చేసికదు సేమము లీయుము శేషభూషణా..

ఉ॥ భూపతి నాదు వ్యాకులము బూర్తిగ దీర్చియు మందబుద్ధినిం
బాపియు నిర్మలత్వమగు భావము నిచ్చియు నింపుసొంపునన్
నేపున మంచి సద్గతిని నేర్పడ జేయుము భక్తపోష నీ
రూపము సాత్వసంపదను రూఢిగ నిచ్చియు శేషభూషణా.

ఉ॥ అద్రిసుతేశ నీ కృపకు నాత్రుతతో దిలకింపుచుంటి సన్
భద్రముగా నను బ్రోవ జను బాయగ నెంచియు మిన్నకుండక
చ్ఛిద్ర మనస్కుఁడీవ యును సిల్గుల బెట్టకఁ జేరు నన్జగ
ద్భద్ర గుణాశ్రయా ఘనకృపానిధి వయ్యును శేషభూషణా.

ఉ॥ తాలిమి సద్ధరించదగు దైవము నీవని నమ్మినాడ నే
శూలధరా వరాలిడగ జూపుము నీకృప యెంతొ బ్రీతిగన్
కాలము బండిచక్రముగ గన్గొని కాంక్షను గోరుచుండినిన్
జాలము సేయకన్ మిగుల జాలిని నేలుము శేషభూషణా.

ఉ॥ నీ కృపచేత నే యవని నిండియునున్న సమస్త జీవముల్
వేకృషి సేయ బాల్గొనెడి వేడుక జెందుచునుందు రెప్పుడున్
నీ కృప హీనమైన ధరణీపతియైన మరేమి దోచకన్
దా కృసియించియుండుగద దారి నెరుంగక శేషభూషణా.

చ॥ నిను మదినెంచు వారలకు నిండగు గష్టము లుప్పతిల్లగన్
యనువు దొలంగ జేసి యతివ్యాకుల మబ్బగ గూర్చుచున్ మహిన్
బనులను దోచనీక పలు బాధలొసంగియు గాంచు టెల్లయున్
యనుచితమైన వృత్తియని యాత్మకు దోచద శేషభూషణా.

చ॥ అనిలసమానమై నెగడు నార్తజనావళి నెన్నొగష్టముల్
బనివడి బెట్టనెంచెదవె భావమదేమొ కటాక్షమీయకన్
యనువును గూర్చుచుండినపుడాజ్ఞను మీరుదురంచు నెంచి యా
తనువుకృతార్థమొందునని దామదలంచియ శేషభూషణా.

ఉ॥ నేరములున్నసైచియును నిండగు ప్రేమిడ గొల్చుచుంటి నిన్
క్రూరమనస్కుడీవయును కూళలగూర్చుట కిచ్చగించకన్
ధీరమనీషబృందముల దివ్యపునేస్తములిచ్చి వేడుకన్
నీరమణీయరూపమిడి నింపుగ కృపన్ గను శేషభూషణా 84

ఉ॥ ఇచ్చెదనంచు జూడ నిపుడేమియు చేతుల లేనివాడనే
నచ్యుతమిత్ర నా హృదయ మర్పణ జేసితినంచు బల్కు నా
యిచ్చను విత్తమంచు నిపుడీ యెదలోన దలంపవేడితిన్
సచ్చరితా ముదంబు నిడు సాగిలి మ్రొక్కొని శేషభూషణా.

ఉ॥ నాదు తలంపు నంబనులు న్యాయముగాగొనసాగ రమ్మదిన్
నీదు బవిత్ర నామమిల నేరుపుగూర్చునటంచు నమ్మితిన్
నీదయ జూపి నేలుమయ నిశ్చలులం గని రాపు సేయకన్
యాదరమొప్ప జూడదగు యాప్తుడవీవుగ శేషభూషణా.

ఉ॥ కారణభూతుడౌ గరళకంఠ నినున్ దలపోయకున్నచో
వారణవీరుడైన నిల నేవిధి తా జయమొంద డంచనే
తోరపువార్త నీ కృపచె దోచిన ధీజనులెల్ల దెల్పినన్
కోరిక జెంది మీ స్మరణ కూరిమి జేసితి శేషభూషణా 87

ఉ॥ కారణమైన కర్మములు గాలుసమానునికైన దప్పనే
భారమణా గనుంగొనగ భూస్థలిలోపల నుండువారికిన్
ఘోరతమిక్కటంబయినశూరుడు నౌ త్రిపురాసురుండుదా
వీరవరేణ్యుడై యసువు వీడి నశింపడె శేషభూషణా 88

చ॥ చలనము గల్గజేసినను చాలగ సిల్గుల పాలుసేతువా
జలజభవాచ్యుతాదినుత జాగొనరించిప్రపంచకర్త నా
దలపును దీర్చగా దగిన దైవము నీవనిగొల్చినాడ నీ
చలమును జూపకన్ సతము సౌమ్యమదింగను శేషభూషణా

ఉ॥ శంకర శంకరాయని శశాంక ధరాస్మరియింపుచున్న నా
వంకను జూడకుండెదవు పాపుడనంచు మదిందలంచి యా
శంకరయన్న వారలకు సంకటముల్విడి పోవునంచు నే
కొంకక వేడుచుంటిత్వరి కోర్కు నుదీర్పుము శేషభూషణా

చ॥ అరమరసేయకయ్య శరణార్థిని గాంచగదయ్య వేగ నీ
దరిగొనినేలుమయ్యకడు దబ్బర సౌఖ్యములియ్య నెంచకన్
మరువక నీపదాబ్జములు మాధవ ప్రేమగ నర్చనంబులన్
తిరముగ సల్పుమార్గమగు దివ్యమదిన్నిడు శేషభూషణా

ఉ॥ ఇచ్చనుగాలు శౌరివిధి యింపుమహాత్ములనీవు భూమిపై
యచ్చెరువొంద సృష్టిస్థితియలయంబులటంచు ప్రౌఢిమన్
తుచ్ఛుల గాలకింకరులు దూలగ జేసియు సత్త్వవర్తనుల్
ముచ్చటదీర్చి నేలుటకు మూర్తులొనర్చిన శేషభూషణా

చ॥ అనఘులు నెందరో భువిని యద్రిసుతేశ్వరయంచు
నెంచవే
ఘనులను జేసియున్ మరియు గ్రన్నన మోక్షమునీయ
నెంతువే
మునుపలవారిజూచుగతిమూర్తిని నాకనులారజూపియున్
తనువు కృతార్థమొందునటు తక్కక సేయుము
శేషభూషణా.

ఉ॥ ఈ భువి నెందరో జనులు నీశ్వరగావుమటంచు బేర్మితో
నీభజనంబొనర్చియును నీప్రియముంగనలేరె కాంచగా
హేభువనేశయీయధము నేవిధినైనను గాంచునీకృపన్
లోభము గాంచకయ్యమదిలోనినునమ్మితి శేషభూషణా.

ఉ॥ పాపపుత్రోవలంబడి యపార ముదంబున బోవకుండగా
మీపదసేవనంబెపుడు మేలని నెంచెడి డెందముండగా
జ్ఞాపకశక్తినిచ్చియును జ్ఞానమతిన్ నెగడించిబాయకన్
యేపున మిమ్ముగాంచువిధమే దెరిగింపుడు శేషభూషణా.

ఉ॥ ఇచ్చుటకేమిలేని కడు హీనుడటంచును గాంచబోకుమీ
రిచ్చిన రెండుహస్తములు నిచ్చటనుండెగ వాటి జేర్చినే
నిచ్చగమీకొనర్చెడిది నింపునమస్కృతిగాంచి దృప్తువై
యిచ్చను దీర్చ నేగుమయ నింపుదలిర్పగ శేషభూషణా

చ॥ పురహరపుణ్యమూర్తి వనుభూస్థలివార్త లెరింగి బేర్మితో
కరివరదాసు తారినినుగాంచుమదిన్ గొనియాడుచుంటిమీ
సురచిరమైనరూపమును సూరిజనావళి కిచ్చినట్లు నా
మొరగనియాలసించకను మూర్తినొసంగుము శేషభూషణా.

చ॥ స్థిరమతు లెందరో భువిని తీవ్రగతిం గడతేరుచుండ గే
మురహరవంద్యమీ భజనమోదముతో నొనరించుచుండియుం
త్వరదయజూపివారికిని వాంఛితమిచ్చియు చింతదీర్చియుం
పరముల సేతువట్టులనె పాలనసేయుము శేషభూషణా.98

చ॥ జపముల నెన్ని చేసినను సర్వమయుండగు నిన్ను కాంక్షతో
నెపుడును గొల్వదేనిదనయాప్తితమంతయు రిత్తయా సటం
చెపుడును వేడుచుంటి జగదీశ్వర సేకుర జేయుమోక్షముం
యిపుడపుడంచు నెంచకను నీక్షణమందున శేషభూషణా

ఉ॥ ఎంతబలాధికుండయిన నెంతయొ విద్యను సేకరించినన్
ఎంతధనంబు జేపడిన యెట్టియుపార మనస్కుడైన దా
నెంత మహాతపంబులను నెంతగ జేసెడివారలైన నీ
యంతురవంత చిక్కకను యంతమునొందును శేషభూషణా

చ॥ ముడిమణిసానబట్టినది బూర్తిగ దేజము గల్గుచుండ దే
చెడుదగు కాంచనంబుగని జేవకునై బుఱ మేయరూపమున్
బడయదెయట్టులే యమిత పాపజనంబులునైన నెప్పుడున్
నిడకనుమీపదాబ్జముల నెంతయు ప్రేమనుగొల్వబై విధిన్
నెడయవె దుష్టవర్తనలు నింపెసలారగ శేషభూషణా.101

ఉ॥ వంకరతుండముంగలుగు వానికితండ్రిమురారి మిత్రయా
కింకరు సంకటంబులచె కీడ్పడ చేయకుమయ్య నీవుచే
శంకలజేర్చకన్ మిగుల శాంతమదిన్ నిజబుద్ధి రీతిగా
శంకరనిన్ను జేర్చుకొని శాశ్వతబ్రేముడు శేషభూషణా. 102

చ॥ పలుమరు వేడుచుంటినని భావము చేతను దామసంబునన్
నలుకగజూడకుండుటయె న్యాయమనీవిధి మిన్నకుంటచే
పలుచదనంబునొందియునుభక్తప్రియుండనుకీర్తి బాసియు
న్నిలనపకీర్తిగల్గునని నెంచియుగాంచుమ శేషభూషణా 103

ఉ॥ ఓ మహనీయ నీకరుణ నద్ధితముండిన గాని రిత్తియా
నే మహనీయుడంచునుడు నేర్పరిసైతము నోప్పు బట్టుగా
దామహినోపజాల డదితధ్యము నెట్లన దోలుబొమ్మలన్
నీమహిలోన నేర్పరులు నీటకనాడు నె శేషభూషణా 104

ఉ॥ ఓ మహనీయ పాపలను నోరుపులేకను బుట్టు వెంటనే
నీ మహిమావిశేషమున నీల్గగజేతువదేమి చిత్రమో
తామహినుండజాలమని దైవమనన్ గొనిపొమ్మటంచు ని
న్నేమరకుండ వేడినను నేమదిగాంచవు శేషభూషణా 105

ఉ॥ కొందరి సార్వభౌములుగ కొండొక కాలము జేయ
నెంచియున్
యందము ఖ్యాతిగల్గునటులందగ జేసియుకొంతమందిబల్
మందలుమందలుంబడియుమాధవునంశమటంచు నెంచుచున్
వందనమొంద జేసెదవు వారికృతజ్ఞత శేషభూషణా 106

ఉ॥ పూజ్యుడ నీ మహత్త్వగని భూరిబలాఢ్యుడు విష్ణుదేవుడున్
బూజ్యతగాంచునట్లుగను భూరమణుల్ హతమొందునట్లుదా
బూజ్యములైన వేసములబూర్తిగ వేసి మహాద్భుతంబుగా
బూజ్యుడనయ్యెమ్మ్రొక్కుపునబూజ్యుడనయ్యెగ శేషభూషణా

ఉ॥ ఈశ్వరనీమనాయులచె నిక్కముకాంతునుగల్గజేసియున్
నైశ్వరియంపుమత్తతనుయంతయునాదను మోహమీయకన్
శాశ్వతకీర్తి నివ్వదగు సాధనమౌభజనంబు నిచ్చియున్
నిశ్వరభక్తతాసుజన నిప్పితమీయుము శేషభూషణా 108

చ॥ ఉరుగుణులెందరో ఘనపుటూహ వెలంగియునిద్ధరిత్రిలో
మరువక నీమ ప్రేమ నినుమంతయు గల్గిన జాలునంచు వే
మొగలిడువారికెల్లరికి మోక్షములిచ్చెదవయ్య యట్టులే
న్మరణమయెనర్పుచుంటినని సత్కృప నేలుము శేషభూషణా.

ఉ॥ తప్పులులేని పాత్రముల దాతరచించిన యుండదంచు నే
జెప్ప సగత్యముండదు విశేషమహత్తుడీవు యీమాటచే
గొప్పబలాఢ్యులా కపులు గుంపులుగూడిన రాము
కార్యమున్
చప్పునబూనదావుహత చాయగబూనితి శేషభూషణా.

ఉ॥ ఇచ్చమునిన్ స్మరించితినినిప్పితమీయుముసీదురూపమున్
ముచ్చట దీరునట్లుగను మందున దాండవమాడునట్లుగా
వచ్చిన సంతసించెదను వహ్వాయటంచును మోహబుద్ధినై
కుచ్చితరూపమిచ్చినను కూలగ జేయకు శేషభూషణా. 111

ఉ॥ ఏల సమస్తసంపదల నేర్పడ జేసెదవయ్య బ్రేముడిన్
బాలుడు నేడ్వ దల్లిగని బ్రాముని బెల్లమునిచ్చుపోలికిన్
కాలము గడ్వ నెంచకుము కారుణికోత్తముడయ్యు నేలకన్
యేలసుతుల్ ధనంబు తనువేలను కొంచగ శేషభూషణా.

ఉ॥ కాలముదార బుత్రులతో గడ్పుచునుంటినటంచు నీశు చే
పాలనుగూడు నీరమగు భక్తుడితండని నెంచకెన్న దున్
శీలముతోడ పంకమున జేరెడి కుమ్మరిపుర్గురీతిగా
నీలగళున్ స్మరించుమతి నే చరియింతును శేషభూషణా.

చ॥ కన్నసుతుండు దుండగిడునై కడుపారగ మెసవ నెంచనా
కన్నము లేదటంచునుడి నయ్యనుపాలును బెట్టుమనిన యా
తెన్నునుజూచి తండ్రి యతి గోధితుడయి వెసశాంత
బుద్ధితో
యున్నదిబంచు భాతిమది నన్నుకమన్నుపుము శేషభూషణా.

ఉ॥ నీదు సహాయభూతమున నేర్పడునుత్పలచంపకావళుల్
మోదముతోడ నీకిడితి ముద్దులమాలగ వేధరించియున్
సాదరమైన డెందమున సాకుమటంచును గోరుచుంటి నే
నీదయ నాదు బ్రాప్తమని నీతిని నమ్మక శేషభూషణా

చ॥ ప్రమధగణాధిపా పతిత పావననామ హరా పరాత్పరా.
సమధికశీలనీకృపచె సాంగముగారచియింతు పాత్రమున్
సుమశరవైరి నీకరుణ సూచన నూటపదారునైన ప
ద్దెముల గడింప జేసితి వదేకృతి జేసితి శేషభూషణా 116

సంపూర్ణము